

వేజండ్ల సాంబశివరావు

జననం : 25-5-1927

స్వగ్రామం : వేజండ్ల, గుంటూరు జిల్లా.

బాల సాహిత్యం, బాలలతో ఆడడం, పాడడం అభిమాన వ్యాసంగాలు.

తెలుగు బాలల రచయితల సంఘంలోను, అఖిల భారత బాలల రచయితల సంఘంలోను సభ్యులు. వివిధ రాష్ట్రాలలో నిర్వహింపబడిన బాల సాహిత్య సమ్మేళనాలలో పాల్గొన్నారు.

1956లో "ముద్దు పాటల"కు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వంవారి బహుమతిని అందుకొన్నారు.

పాల పాటలు, ముద్దు పాటలు, బాల సిపాయి, గోరు ముద్దలు, ఉడుతా హుషార్, రాజుగారి విచారం, వ్యాపారి సంచారం, గప్‌చిప్ కథలు వీరి ముద్రితములైన రచనలు. మరెన్నో అముద్రిత రచనలు వెలుగులోనికి రానున్నవి.

ప్రస్తుతం పల్లెపట్టులలోని పాలబడి ఉపాధ్యాయుడుగా పని చేస్తున్నారు.

---

# బడాయి మేక

## గేయ కథలు

సంకలనకర్త :

వేజండ్ల సాంబశివరావు



ప్రచురణ :

ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమి

బర్కత్‌పురా, హైదరాబాద్ - 500 027

# BADAAYI MEKA (Geya Kathalu)

Compiled by VEJANDLA SAMBASIVA RAO

*Published by:*
**Buddiga Subbarayan,**
Secretary, Andhra Pradesh Baalala Akademi,
Barkatpura, Hyderabad - 500 027

*Editor:* **Yeditha Kameswara Rao**



బాలల అకాడమి ప్రచురణ : 19

వెల : రు 5/-

ముఖచిత్రం : ఎమ్. కనక సూరిబాబు
చిత్రాలు : 'త్రిగుణ్'

ముద్రణ :
పద్మా పవర్ ప్రెస్,
కుత్బిగూడ, హైదరాబాద్ - 27.

ముఖ చిత్ర ముద్రణ :
విజయ్ గ్రాఫిక్స్,
గౌలిగూడ, హైదరాబాద్.

# నా మాట

పిల్లల మనసులు పాల గిన్నెలు. ఆ గిన్నెలను అబద్ధాలతో, అతిశయోక్తులతో నింపకూడదు. హాస్యం, లాస్యం ఆనందం అనే పాల ధారలతో నింపాలి. అందులో నీతి, నియమం, విజ్ఞానం, వినోదం అనే పదార్థాలు రంగరింపజేసి త్రాగించాలి. అప్పుడే వారికి తృప్తి, సంతృప్తి ఉంటుంది. అదే వారి ప్రగతికి దోహదం చేస్తుంది.

అది దృష్టిలో పెట్టుకొని ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమి వారి ఆదేశాను సారంగా వివిధ రచయితల కథాగేయాలను ''బడాయి మేక'' అను పేర సంకలనం చేశాను.

ఈ పాటలన్నీ పిల్లలకొరకు వ్రాసినవే. ఇందులో ఎక్కువ భాగం పాడుకోవడానికి, పాడుతూ అభినయించడానికి, కొన్ని చదివి ఆనందించడానికి పనికి వస్తాయి.

సాధ్యమైనంతవరకు పిల్లల మనస్సును, వయస్సును అర్థం చేసుకొని ఈ కథా గేయాల్ని సంకలనం చేయడానికి ప్రయత్నించాను. ఇందులో పాత కొత్త కలాలే కాక ఈనాటి చేయి తిరిగిన రచయితల వివిధ రీతుల కథా సరళిని కూడా ప్రవేశపెట్టడం జరిగింది. వారందరికీ నా అభినందనలు. స్థలా భావంచేత కొందరివి ఈ సంకలనములో చేర్చలేకపోయాను.

ఈ కథా గేయాలు 6 నుండి 15 సంవత్సరాల వయసువారి కొరకు సంకలనం చేయబడినవి. ఈ సంకలనంలో అభినయ గేయకథలు, బృందగాన గేయ కథలు, సంవాద గేయకథలు, కథాగానం గేయ కథలు చోటు చేసుకున్నాయి.

## 1 అభినయ గేయకథలు

తన, ఇతరుల అభిప్రాయాల్ని తెలిపే హస్తాది చలనాన్ని అభియనం అంటారు. ఒకే ఒక వాక్యంలో చెప్పాలంటే – ''అంగ విన్యాసముచే అర్థమును స్ఫురింపజేయుట'' – అనవచ్చు.

ఈ ప్రక్రియ అంటే చిట్టి చిట్టి పిల్లలు ఎంతో ఉత్సాహం చూపిస్తారు. అందుకే ప్రాథమిక పాఠశాలల్లో ఈ విధానానికి విపరీతమైన ఆదరణ ఉంది. అనుశృతంగా ప్రాథమిక పాఠశాలల్లో ఏ పిల్లవానినోట విన్నా కాకి–నక్క, నక్క–

ద్రాక్ష పళ్లు, కాకి-కూజా మొదలయిన అభినయ కథాగేయాలు తరచుగా వింటాము. ఇవి పిల్లల మనస్తత్త్వాలకు అందుబాటులో వున్నాయనడంలో సందేహం లేదు.

అభినయ కథాగేయాలను రాగతాళ యుక్తంగా, లయబద్ధంగా, అంగ విన్యాసాలతో భావ ప్రకటన చేస్తూ వుంటారు. కనుక పిల్లలకు కథంతా చక్కగా గుర్తుంటుంది. ప్రతి పదం నోటికి వస్తుంది. మనస్సుకు యిట్టే హత్తుకొంటుంది. సర్వాంగాల కదలిక జరుగుతుంది. కండరాల చలనం శరీరానికి ఆరోగ్యకరం. తద్వారా మనస్సు నిత్యనూతనంగా వికసించడానికి దోహదం కల్గుతుంది. బాల సాహిత్యంలో ఇది ఉత్తమోత్తమ ప్రక్రియ అని అనుభవం వలన తెలిన విషయం.

అందుకే, తెలుగు బాల సాహిత్యంలో ఈ ప్రక్రియపై అనేక అభినయ కథాగేయాలు వయస్సుకు తగినట్లుగా విరివిగా వ్రాయాలి. ఉపాధ్యాయులు పాఠశాల లందును, తల్లిదండ్రులు, పెద్దలు గృహ సీమలందును పిల్లలచే అయా గేయాలను చక్కగా పాడించి అభినయింప చేయాలి.

## 2 బృందగాన గేయ కథలు

"ఏకస్వాధు నభుంజేత" రుచిగల పదార్థమును తానొక్కడే అనుభవించక పదిమందికి అందించి, తాను ఆనందించి ఇతరులను ఆనందింపచేయువాడు ఉత్తమోత్తముడు. ఈ ఉత్తమోత్తమ ధర్మ ప్రదర్శనమే బృందగానం అంటారు.

ఈ ప్రక్రియలో ఒకరిద్దరు కాక పదిమంది కలిసి గానం చేయడం అభినయించడం మనం చూస్తాము. ఒకరు చెప్పడం, పదిమంది అనుకరించడం ఇందులో జరుగుతుంది. సమైక్య భావన, క్రమశిక్షణ, ప్రదర్శన జరుగుతుంది. ఏకాగ్రత కుంటుపడదు. తమకుతామే ఆత్మానుభూతి పొంది ఆనందాబ్ధిలో తెలియాడటమే గాక, చూచువారికి కూడా కనుల పండుగ గావిస్తారు పిల్లలు.

## 3 సంవాద గేయ కథలు

ఈ విధానంలో ధర్మా ధర్మములు, నీతి నియమాలు, స్వేచ్ఛగా ప్రకటితమవుతాయి.

అంతేకాదు, ఎత్తుకు పై ఎత్తు, చమత్కృతి, సమయస్ఫూర్తి, తర్క వితర్కాలు, భాషా సౌలభ్యం, నేర్పు, ఓర్పు, పట్టుదల ఈ ప్రక్రియలో అభివృద్ధి పొందుతాయి. భావానుక్రమంగా అభినయం తనంతట తానే ప్రదర్శింపబడునని వేరుగా చెప్పనవసరం లేదు.

## 4 కథాగానం

ఒక కథ చందోబద్ధంగా కథాగానంలో గానం చేయబడుతుంది. కథలోని రసభావాలకు తగినట్లు గానం చేసిన పిల్లలకు భావరసోద్రేకం కలుగుతుంది. కథ యందనురక్తి ఉత్సాహ ప్రవృత్తులు పెంపొందుతాయి నిజం చెప్పాలంటే ఈ విధానం లలిత గేయాల కోవకు చెందినదే.

## 5 గేయ కథలు

"కథలను కథలుగా గాక గేయ కథలుగా రాయడం ఒక కవితా విన్యాసం. గేయ కథలు చదువుకొనడానికి, వినడానికి హృదయంగమంగా ఉంటాయి. గేయ కథలను చదివిన బాలలకు పద్య కథలను చదవాలనే అభిలాష కలుగుతుంది. దీనివల్ల సాహిత్యం యెడల వారి అభిరుచులు పెంపొందడానికి అవకాశం ఏర్పడుతుంది."

—*ఏడిద*

"గేయ కథల్లోని నీతులు పసిడి హృదయాల్లో చక్కగా హత్తుకుంటాయి. ముందు ముందు వారు ఉన్నతులు కావడానికి ఉపయోగపడతాయి. అలాంటి తీయని గేయ కథల్ని, వాటి నందించిన రచయితల్ని మనం అభినందించాలి, ప్రోత్సహించాలి."

—*అలపర్తి*

ఈ గేయకథల రీతుల్లో వైవిధ్యం వుంది. కథ క్లుప్తంగా కాకుండా తీగ లాగ సాగిపోతుంది. అర్థ వివరణ చక్కగా జరుగుతుంది. అందుకే బాలల్లో వయస్సు ఎదిగిన వారికి ఇది చదివి ఆనందించుటకు ఉపకరిస్తుంది.

ప్రాథమిక పాఠశాల ఉపాధ్యాయునిగా నాకున్న అనుభవంతో ఈ సంకలనం చేశాను. సోదర ఉపాధ్యాయులు సహకరించి వీటిని సద్వినియోగం చేస్తారని ఆశిస్తాను.

ఈ సదవకాశం ఇచ్చిన ఆం. ప్ర. బాలల అకాడమీకి నా హృదయ పూర్వక అభినందనాలు.

చిన మట్లపూడి
గుంటూరు జిల్లా.
8-11-82

వేజండ్ల సాంబశివరావు
'సంకలనకర్త'

# ప్రస్తావన

నేటి బాలలు రేపటి పౌరులు, దేశ సౌభాగ్య నిర్మాతలు - నిర్ణేతలు-నేతలూను. కనుక వారి సంపూర్ణ వికాసానికి తగిన పరిస్థితులూ - పరిసరాలూ, ఆదరణలూ- ఆప్యాయతలూ- ఆశయాలూ- అవకాశాలూ చేకూర్చి సక్రమపథంలో సాగేటట్టు చేయవలసిన గురుతరమైన బాధ్యత పెద్దలపైన ఉంది. కల్లాకపటంలేని ఆ పాలమనసుల్లో ఏ భావాలకైతే బీజావాపం జరుగుతుందో అవే వారితోపాటు ఎదిగి శాఖోపశాఖలుగా విస్తరిస్తాయి. కాబట్టి ఉదార భావాలనీ, ఉదాత్త ఆశయాలనీ, ఉచితానుచితజ్ఞతలనీ, లోకజ్ఞత విజ్ఞతలనీ ఆ పసి మనసులలో నాటుకునేటట్టుగా బోధించడమెంతైనా ఆవశ్యకం. దీనికి తేటతేట పదాల కూర్పుతో లయాత్మకంగా ఉండే 'చిట్టి - పొట్టి' కథలు ఎంతో ఉపకరిస్తాయి. గేయానుకూలమైనవి మరింతగా రాణిస్తాయి. ఇటువంటి గేయ కథానికలను సుమారు ఏభైదాకా సేకరించిన శ్రీ వేజెండ్ల సాంబశివరావుగారి కృషి శ్లాఘనీయం. దీనిని ప్రచురించిన ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమి వారి సదాశయము ముదావహం.

ఈ సంపుటిలో పేరొందిన కవుల రచయితల రచనలెన్నో ఉన్నాయి. వాటిల్లో నీతిని ఉపదేశించేవి, లోకజ్ఞతను కలిగించేవి, శిష్టాచారాలను గఱపేవి, మహాత్ముల చరిత్రలను మననం గావించేవి, ప్రకృతి వర్ణనాత్మకమైనవి, హాస్య చతురోక్తులను చవిచూపేవి, వైజ్ఞానిక విషయాలను బోధించేవి - ఇలా ఎంతో వైవిధ్యంతో భాసించేవి వున్నాయి. పక్షులన్నా- జంతువులన్నా- జలచరాల్నన్నా కుతూహలాన్ని చూపడం పిల్లల నైజం. ఆటపాటలపైన మోజు పడడమూ సహజమే! కనుక వీటినాధారం గావించుకుని రచనలను మలచడం రచయిత లక్ష్య సాధనలో ఉత్తమమైన పద్ధతి.

ఇందులోని ప్రతీ గేయ కథానికా బాలబాలికల్ని 'వెలుగుబాట' వైపు మళ్ళించేదిగా ఉండి, సాహిత్య ప్రయోజనాన్ని సంతరించుకుంది ఈ సంపుటి.

హైదరాబాదు.
8-11-82

డాక్టరు ఎన్. నిర్మలాదేవి

# మ న వి

"మాటలో పాట
పాటలో ఆట
ఆటలో తేట
పాపల్ల మూట
మూటలో ముత్తెముల
మెఱుపుల బాట"

మాట - పాట - ఆట - పాల పాపల ఆనందాల మూటలు! ఆట పాటలకు బాల పాపలకు వున్న అవినాభావ సంబంధం అనిర్వచనీయమైనట్టిది. మాటలోంచి పాటలోకి, పాటలోంచి ఆటలోకి పరవళ్లు త్రొక్కే వారి ఆనందాలకు అవధులు వుండవు!

మాటలనే వారు పాటగా పాడగలరు, పాటలనే వారు ఆటలా ఆడగలరు! అందుకే వారి ఆటపాటల్లో కాళ్లు కదం తొక్కుతాయి; చేతులు అభినయానికి అందాలు తొడుగుతాయి; కళ్లు భావాలనే తొణికిసలాడతాయి.

పిల్లల్లో పొంగి పరవళ్లు వారే ఈ అద్భుతశక్తిని ఆలంబనంగా గైకొని-వారి ధోరణిలోనే వారికి జ్ఞాన విజ్ఞానాలను అందించడానికి చేసే ప్రయత్నం 'కథ'-దానికి కళాలంకరణ చేసిన 'గేయకథ'- అత్యంత ప్రాధాన్యమైన ప్రక్రియలు!

చిట్టి పొట్టి మాటలతో, చిన్నచిన్న భావాలతో, ఓ పిట్టకథను మాత్రా ఛందస్సును పాటిస్తూ - ప్రాసపుప్పొడిని పొదిమి ఓ గేయాన్ని గీసి, పాడుతూ, పిల్లలచే పాడిస్తూవుంటే - ఆ బాలపాపలు లయాన్వితంగా ఆడే ఆటను చూడ కళ్లు చాలవు, ఆ దృశ్యం కలగించే ఆనందం అలౌకికం!

కనుకనే బాల సాహిత్యంలో గేయాలకు, గేయ కథలకు అబ్బురమైన స్థానం అమరి వుంది. అందువలననే ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమి ప్రచురించ తలపెట్టిన "బాలసాహిత్య సర్వస్వం"లో ఒక భాగంగా ఈ గేయ కథా సంకలనం రూపొందినది.

ఈ ప్రయత్నానికి ఎంతో ఉత్సాహంగా సహకరించిన శ్రీ వేజండ్ల సాంబశివరావుగారికి, ఈ సంకలనాన్ని చక్కగా సమీక్షించిన శ్రీమతి డాక్టరు యన్. నిర్మలాదేవి గారికి, ముద్రణాదికములలో తోడ్పడిన శ్రీ డి. రామలింగం గారికి, బాలల అకాడమి తన కృతజ్ఞతలను తెలియజేస్తున్నది.

ఏడిద కామేశ్వరరావు
సంపాదకుడు

# విషయ సూచిక



# వింతకథ

పి. రాజగోపాలనాయుడు

వింటివా చెల్లీ!
  వింతకథ నీవు?
సూది బెజ్జములోన
సూర్యుండు పుట్టె?

కంటివా చెల్లీ!
కనుకట్టు విద్య?
మామిడీ కాయలో
మనుజుండు పుట్టె




జామచెట్టు కొమ్మమీద
కూరుచున్నది
రామచిలుక జామకాయ
కొరుకుచున్నది

కొంటెకిష్టి దాన్ని చూచి
కొక్కిరించెను
మట్టిగడ్డ దానిపైకి
విసరికొట్టెను.

కోపగించి రామచిలుక
రాం, రాం, రాం,
జామకాయ విసరికొట్టె
జాం, జాం, జాం,
కిష్టిగాడి నెత్తిమీద
ఢాం, ఢాం, ఢాం,




షికారుగా ఒక చిట్టెలుకా
పొలాల గట్టున పోతుంటే!
నింగీ ఎగిరే కాకమ్మా
నేలా వాలీ నోటను బట్టీ
ఇట్టే పైకి ఎగిరింది

చిగురు మామిడీ కొమ్మలలో
కోకిల కోయని అంటుంటే!
పోటీ చేయగ తలచింది
తానూ 'కావ్' అని పాడింది
నోటిలోని ఎలుక జారింది
కలుగులోకి చరచర దూరింది

నీతి

మనస్సు నిలకడ ఉంచాలి!
పనులకు వివరము చూపాలి!




కొంగా తల్లీ చెట్టూమీదా
గూడూ కట్టిందీ
గూడూ కట్టీ అందూలోనా
గుడ్డూ పెట్టిందీ....

గుడ్డూ పొదిగి కొంగాతల్లీ
పిల్లను చేసిందీ
కొంగాతల్లీ కొంగాపాపను
ప్రేమగ పెంచిందీ....

కొంగా పాపకు ఆకలైతే
బువ్వా పెట్టిందీ
కొంగా పాపకు నిద్రావస్తే
జోలా పాడిందీ....

కొంగాతల్లీ చెరువుకు వెళ్ళి
చేపను తెచ్చిందీ
కొంగా పాపకు ఆకలైతే
చేపను పెట్టిందీ....

కొంగాతల్లీ కొంగాపాపకు
ఆటలు నేర్పిందీ
కొంగాతల్లీ కొంగాపాపకు
పాటలు నేర్పిందీ....

కొంగా పాపకు రెక్కలురాగా
ఎగురుట నేర్పిందీ
వానాకాలము ముసురుకు రాగా
వేటలు నేర్పిందీ....

కొంగా పాప ఎదిగీ ఎదిగీ
కొంగై పోయిందీ !
ముసలీ తల్లికి తానే అపుడు
తల్లై పోయిందీ॥——




అదిగో — ఆ కప్ప
ఇదిగో — ఈ ఎలుక !
స్నేహంగా ఉంటున్నై
కలసి మెలసి తిరుగుతున్నై ॥
గట్టులన్ని గుట్టలన్ని
ఆడి పాడి ఉరుకుతు ఉన్నై ॥

తమ స్నేహం పెరగంగా,
పేరు దిశల మ్రోగంగా !
తాడుతో తమను కట్టుకున్నై
దుముకుచు ముందుకు పోతున్నై

అదిగో — ఆ కప్ప !
నీటిలోకి దూకింది
దానితో పాటుగా
'అయ్యయ్యో' ఆ ఎలుక
నీటనె పడి చచ్చింది !

**నీతి**

తగని వారితో స్నేహంరా
తన ప్రాణానికి మోసం రా !




'క్రావ్' అంటు ఎగురుతువుంట
'కావ్‌కావ్' అంటూ ఆడుతువుంట
ఊహావాడా తిరుగుతువుంట
ఉత్సాహంగా పాడుతువుంట
॥కావ్ కావ్॥

నలుపూరంగూ వద్దంటా
తెలుపంటే బహు ముద్దంట
కోరిక తీరే మార్గమెలా ?
కొంగల్లాగా వుండుటెలా ?
ఇప్పుడె చేస్తా ఇలాఇలా !
"కావ్ కావ్"

కొలనూ నీటిలొ మునిగేస్తా
ఒళ్ళంతా తెగ రుద్దేస్తా
ఱెక్కలు గిక్కలు ఉతికేస్తా
ముక్కుతొ పొట్టను కడిగేస్తా !
"కావ్ కావ్"

పొద్దుపొడుపుతో మొదలెట్టా
పొద్దు విడుపుతో సరిపెట్టా
ఎంతరుద్దినా తెలుపది సున్నా
ఊపిరి ఆడక చస్తున్నా !
అమ్మో....రొంప !
॥కావ్ కావ్॥

తెలుపూరంగు నా కొద్దు - నా
నలుపన్నది నా కెంతో ముద్దు !
నల్లగవుంటే దోషం లేదు
కోకిలమీదా ద్వేషం లేదు
॥కావ్ కావ్॥




నీవూ నేనూ
ఒకటే జాతి
నీకూ నాకూ
రోషం జాస్తీ
పోరుకు సిద్ధం
రారా ! నేస్తం !

గెలిచిన వారూ
ఇల్లెక్కి
కొక్కొరొకోయని
కూయాలి,
ఓడినవారూ
గూటిలో దూరి
కుక్కిన పేనుగ
ఉండాలి !

నీవే ఓడావ్
నేనే గెలిచా !
ఇల్లెక్కేస్తా
కూసేస్తా !
'కొక్కొరొకో'
కొక్కొరొకో !

వెళ్ళే వెళ్ళే
దేగమ్మ !
కూత విన్నది
ఓయమ్మా !
రివ్వున నేలకు
వచ్చిందీ
కోడిని తన్నుకు
వెళ్ళిందీ !

ఓడిన కోడి ఏమంది ? - 'నా
గూడులో గుట్టుగ ఉన్నా' నంది
గెలిచిన కోడీ ఏమంది ? - 'నా
గర్వము నన్నే బలిగోరింది'




గోడమీది సింహం
చూస్తేనే భయం భయం ;
ఉరిమీ ఉరిమీ చూస్తుంది
ఒణుకు పుట్టుకు వస్తుందీ !

'కావ్ కావ్' మంటు కాకి
దానిపైన వ్రాలింది
ముక్కుతోడ పొడిచింది
కాళ్ళతోడ గీకింది

కదలదేమి సింహము ?
మెదలదేమి సింహము ?
కోపమణగి పోయెనా ?
లేక చచ్చిపోయెనా ?

గోడ మీది సింహం
అసలు సింహం కాదుర !
గోడమీది సింహం
చూడ వట్టి బొమ్మరా !

నీతి

తాడు చూచి పామనుకొను
భ్రాంతి కిటుకు తెలిసెరా !
అవునో కాదో - తెలియకుండ
అదరి బెదరుటేలరా ?



# పోరునష్టం

కరిబాల గంగాధరరావు

తెలతెలవారే వేళంది
'కొక్కొరొకో'యని కోడంది
పిల్లల నిద్దుర లేపింది
మేతకు నాతో రమ్మంది !

తల్లీ పిల్లలు కలిశాయి
అందున ఇందున తిరిగాయి
పురుగూ పుట్రా చూశాయి
నోట్లోవేసుక మ్రింగాయి !

'కొక్కొరొకో'యని తల్లంటే
'క్కెక్కెక్కే' యని పిల్లలు అన్నాయి
సంతోషంతో తల్లిని విడిచి
పెంటకుప్పపై కెగిరాయి !

ముక్కుతో మట్టిని కెలికాయి
కాళ్ళతో మట్టిని చిమ్మాయి
పురుగు వొక్కటీ కనుపిస్తే
"నాకూ నాకని" కలహిస్తూ

తల్లి చెంతకూ చేరాయి
తగవు తీర్చమని అన్నాయి
పెంటకుప్పపై పురుగుంటే
సమముగ పంచుక తినమంది !

పిల్లలు అచటికి జేరకముందే
చల్లగ పురుగూ జారింది
తెలివి తక్కువగ కలహిస్తే
ఫలితం తలక్రిందౌతుంది




వేకువనే ఓ జాలరీ
　　వెళ్ళికూర్చొనీ చెరువుదరీ,
రంయ్యిన వేసెను తనగాలం
అయ్యో నచటనే సాయంకాలం !

అక్కటా! ఎంత సేపైనా
చిక్కలేదు ఒక చేపైనా !
కారణమేమని యోచించె
గాలంతీసి తిలకించె !

గుర్తుకువచ్చెను అపుడౌర !
గుచ్చలేదనీ అసలె "ఎర" !
చూశారా ఆ మతిమరుపు!
చేసెను ఎంతో పని చెరుపు !



# లాభం-నష్టం

కవిరావు

కాకి యొకటి ఆకలితో
    'కావు, కావు,' మనుచును
మెతుకులకై ఊరిలోన
వెతుకులాడ సాగెను

కాకి చూచె పుల్లివిస్త
రాకు నొక్క సందులో
సంతసించి కాకి దాని
చెంతవ్రాలె నంతలో

'కాకా' యని కేకవేసె
కాకుల రారండని,
ఆరగింపసాగె కాకు
లన్ని చేరి దానిని

దుక్కవంటి కుక్క ఒకటి
అక్కడి కేతెంచెను,
కాకుల వెంటాడి ఎంగి
లాకు నోటకరచెను.

అప్పుడె వచ్చిన దింకొక
అదరగొండి కుక్క
ఎగిరిదానిపైన దూకి
తగవులాడ సాగెను

పుల్లి విస్తరాకు చిరిగి
చెల్లా చెదరాయెను
కుమ్ము ధుమ్ములాడుచుండ
కూడు మట్టి కలిసెను

కాకులవలె ఎల్లప్పుడు
కలిసి బ్రతుక లాభము
కాట్లకుక్క లట్టు లెపుడు
కలహించుట నష్టము




ముసురు వాన రాతిరీ
ముసలి యవ్వ గుడిసెలో
రొట్టెముక్క పంపకమ్ము
గుట్టుగాను చేసుకోక
పిల్లికూనలంట రెండు
పెద్ద కీచులాడె నంట

కోపమొచ్చి అవ్వ అంత
చీపురొకటి చేతబూని
వీపుచిట్ల చావమోదె
పాపమనక బయటికంపె॥

తెల్లవార్లు వానతడిసి
పిల్లులు కడు డస్సిపోయె
బుద్ధిలేక తగవులాడ
ఇద్దరికిని శాస్తి జరిగె॥

కాన బాలలార! మీరు
కయ్య మెపుడు ఆడవలదు
నెయ్యముతో అన్ని పన్నులు
నేర్పుగాను సాధింపుడు!




లేవండోయ్ పిల్లల్లారా !
లేవండోయ్ పాపల్లారా !
ఏటాఏటా వచ్చేపల్లకి
ఎక్కండోయ్, రారండోయ్
కోకోకుం, ఓం, ఓం, ఓం.

శాంతి అహింసా సత్యం వెలిగే
కుచ్చులపల్లకి నెక్కండి,
కదురూ కవ్వం, ఆడే విడిదిని
కాళ్ళూ కడగండీ
కోకోకుం, ఓం, ఓం, ఓం,
కోకోకుం, ఓం ఓం, ఓం,

పూలూ చల్లండీ - మంచి
బుక్కాయ్ చల్లండీ
అడుగులు సరిగా అడుగులు వడిగా
అల్లదె! వీరాంగం
దండాడింపులో గాంధీతాతకు
దణ్ణం పెట్టండీ !
దణ్ణంపెట్టీ దగ్గఱకొస్తే
గులాము కొట్టండీ.

లేవండోయ్ పాపల్లారా !
లేవండోయ్ పిల్లల్లారా !
ఏటాఏటా వచ్చేపల్లకి
ఎక్కండోయ్ రారండోయ్ !

కో కో కుం
ఓం ఓం ఓం
కో కో కుం
ఓం ఓం ఓం




గిరగిర తిరిగే బొంగరమున్- నే
గిరకలు తిరిగే బొంగరమున్
కళ్ళు తిరగనీ బొంగరమున్-మరి
ఒళ్ళు తూలనీ బొంగరమున్

నాలాగే ఈ భూగోళం- తా
నిలచి తిరుగునూ తనచుట్టూ
''జాలీ''లేనిది భూగోళం-మరి
జారిపడదు, విడువదు పట్టూ॥

పామే తాడుగ పర్వతమూ-బల్
పట్టుగ తిరిగెను మందరమూ
భూమిని పోలిన బొంగరమున్-నే
కాలము చుట్టిన మందరమున్.




ఆమె: నూకలు వేస్తాను
మేకలు కాస్తావా ?

అతడు: ఊఁ....కాస్తానూ....!

ఆమె: పులి వస్తేనూ....
భయపడతావా ?

అతడు: ఊహుఁ....

ఆమె: తోడేలొస్తేనో?

అతడు: ఊహు....

ఆమె: నక్క వస్తేనో ?

అతడు: హమ్మో....హమ్మో
భయమేస్తుంది. ..!

ఆమె: నక్కంటే తుదకు
భయమెందుకు నీకు?

అతడు: టక్కరి జిత్తుల వరడు
నక్కను నమ్మడు ఎవడు !

ఆమె: పులి సింహాలు
క్రూర జంతువులు
అందర చంపును కాదా
అవియన భయమేలేదా?

అతడు: మాంసం వాటికి ఆహారం
ఆహారం కోసమె సంహారం!
తెలుసుకునీ వాటి నైజం
మసులుకున్న తొలగు భయం
నమ్మగ పలికి మోసంచేసే
నక్కలాంటివి కావు అవి !

ఆమె: అలాగా! అయితే చెప్పు
ఎవరంటేను నీకు భయం?

అతడు: దొరలా వచ్చే దొంగ భయం
చెప్పేదొకటి చేసేదొకటి
మనసులొ మాయ,
మాటలొ మర్మం
నీతి ముసుగులోని మనిషి
నీడ చూచినా నాకు భయం!
దూరంగా వుండటమే నయం!




అనగా అనగా ఒక కోతి
అడివంతా అది అల్లరిచేయున్
కోతి చేష్టలు కొల్లగ చేసీ
అన్నిటి నుసూరు మనిపించున్

ఆ అడవిని ఒక పొదరింట
కుందేలొక్కటి కుదురుగ నుండెన్
కోతి పోరుకు కుందేలు
కుమిలీ కుమిలీ కుళ్ళుచు నుండెన్

తోక పట్టుకొని పైకెగరేయున్
చెవులు పట్టుకొని చరచరలాగున్
కుయ్యో మొఱ్ఱో కూడ దన్నచో
ఎక్కిరించును, పండ్లిగిలించున్

ఒకరోజున ఆ కోతి ఒంటరిగ
చెట్టు తొఱ్ఱలో కునుకుచు వుండగ
కుందేలల్లన కోతిని చేరీ
తోక కటుక్కున త్రుటిలో కొరికెన్

తోక తెగెనురా కోతి బావకు
కోపము తీరెను కుందేలునకు

నీతి

దెయ్యానికి మరి దెబ్బే గురువు.




పాము ఒక్కటి రాత్రి వేళను
కాకి గ్రుడ్లను పొట్ట బెట్టును
కాకి బాధను తెలిసి నక్క
బాధ తీరెడి విధము తెలిపెను

రాణి పోవుచు కొలను లోనికి
రత్నహారము గట్టు నుంచెను
కాకి చూచెను - నోట బట్టెను
పుట్టలోనికి ఇట్టె విడిచెను

భటులు వచ్చిరి పుట్ట త్రవ్విరి
పాము చంపిరి హారమిచ్చిరి
రాణి నవ్వెను - కాకి నవ్వెను
యుక్తి చెప్పిన నక్క నవ్వెను

నీతి

ఎవరు తీసిన గోతిలో
వారె పడుదురు నిజము ఇలలో!




కలసి మెలసి చిన్న పిల్లలు
కాయుచుండిరి ఆలమందలు
ఎండ వేడి ముదరగా
ఎండె వారి గొంతులు

నీరు త్రాగ నూతి కడకు
వారు వచ్చి చేరిరి;
'చేద' లేక నూతివద్ద
చుట్టు కలయ చూచిరి

అంతలోన బాలుడొకడు
సుంత మెదడుకు పదును పెట్టెను
చెంత తాటి కమ్మ దెచ్చి
చేద నిట్టె కట్టి చూపెను

తలకు చుట్టుకున్న గుడ్డ
తాడులాగ చేసెను
చేదవేసి నీరు తోడి
చెలుల దాహము తీర్చెను

ఉపాయముంటే ఊళ్ళేలొచ్చు!
అపాయ మెరుగక బ్రతకొచ్చు!




ఉల్లాసముగ పిల్లలు ముగ్గురు
విల్లమ్ములతో వేటకు వెళ్ళిరి
పగలంతయు వేటాడిరి
ఏమియు గానక విసిగిరి....ఆపై
పడవొక్కటి కన్పించింది
అటు ఇటు గాలికి ఊగుతు ఉంది

ఒకడది పడవన్నాడు
వేరొకడది కాదన్నాడు
గాలికి 'రెపరెప' లాడే
దీపం వెలుగన్నాడు
మూడవవాడు

పగలంతయు వేటాడిరి
ఏమియు గానక విసిగిరి-ఆపై
గుడ్ల గూబ కనిపించింది
మోదుగు చెట్టుపై కూర్చుంది

ఒకడది గూబన్నాడు
వేరొకడది కాదన్నాడు
ముసలివాని గడ్డంలోని
మిల మిల మిల మెరుపన్నాడు
మూడవవాడు

ముగ్గురు మూర్ఖులు వీరు
వీరికి సాటిల వేరెవరు ?




చాలారోజులుగా మాంసందొరకక
'డీలా'పడింది బాగా ఒక నక్క
బిక్క మొగంతో బక్క కడుపుతో
డొక్కలు మాడిన ఆ నక్క

ఆవురావురని అడవి అంతటా
ఆహారముకై తిరిగింది!
చిట్ట చివరికొక చెట్టు తొర్రలో
రొట్టెలు, మాంసం చూసింది!

ఇరుకు తొర్ర అని ఆలోచించక
ఉరుకుతు లోనికి దూరింది
పొట్ట చెక్కలగునట్లు అది
రొట్టెలుమాంసం మెక్కింది

పోదామనుకొని లేచెనుగానీ
పొట్ట అడ్డమైపోయింది
వెలువడ మార్గం కానకను
విలపిస్తూ మరి కూర్చుంది

ఏడుపు వినబడి వేరొక నక్క
ఏమిది అనుకొని వచ్చింది
చిక్కుపడిన ఆ నక్కను చూసి
చక్కని సలహా ఇచ్చింది

నకనకలాడే సమయంలోన
చరచర పోతివి లోపలికి
నకనకలాడేటప్పుడె మళ్ళీ
చకచక రావలె వెలుపలికి

నీతి

ఎంత గింజుకొన్ననుగాని
ఏమి లాభ మొక్కొక తరి
కాల మహిమవల్లనే సాను
కూల పడును కార్యములు




కోటయ్యను ధనికుడొకడు
కోటికి పడగలు ఎత్తాడు
వానికి తిండికి కొదువేలేదు
పని పాటలపై మనసేలేదు

కడుపు నొప్పితో కష్టంబు
దగ్గు తుమ్ముతో నష్టంబు
అన్నము కొద్దిగ తినలేడు
తిన్నగ నిద్దుర పోలేడు

చక్కగ లేచీ కూర్చోడు
ఎక్కువ నడచీ పోలేడు
అంత డబ్బుతో కోటయ్యా
సుంత సుఖించగ లేడయ్యా

ఆరోగ్యంబను భాగ్యంబు
అన్నిటి మించిన భాగ్యంబు
ఇంత గొప్పదగు భాగ్యమ్ము
ఇల నెంత వెదికినా కనలేము

అందుకె మనమూ ఓ బాలా!
ఆరోగ్యంతో ఉండాలీ
వేకువ జామున లేవాలీ
వేళకు స్నానం చేయాలీ

మంచి మార్గమున నడవాలి
మురికి వస్తువుల విడవాలి
చెడ్డ త్రోవలను వదలాలి
బుద్ధిమంతులై మెలగాలి

ఇప్పటి నుండే నేర్వాలి!
ఎప్పటికొరకై నిలవాలి!

**బి డా యూ మే క**



# యుక్తి-రక్తి

కవ్వల ఆంజనేయశర్మ

మబ్బులు దుబ్బులు తాకంగా
  కాకమ్మొక్కటి ఎగిరింది
దప్పిక వేసీ గిరగిరా తిరిగి
నీటి కోసమై వెతికింది

తిరిగి తిరిగి చిన్న మూతి
కూజా ఒక్కటి చూచింది
అందని నీటిని అడుగున చూచి
పొందుట ఎట్లని తలచింది

చిన్ని చిన్ని రాళ్ళను ఏరి
కూజాలో పడవేసింది
రాయీ రాయికి నీరూ పొంగి
అంచుల దాకా వచ్చింది

యుక్తికి మించినదేదీ లేదని
దాహం తీర్చుక ఎగిరింది
యుక్తితో బాలా బాలికలారా!
రక్తిగ బ్రతుకుట నేర్వండి

# ఏనుగు బరువు



కె. కృష్ణమూర్తి

అప్పుడెప్పుడో అలకాపురిని
గొప్పగ యేలే భూకాంతుడు
గొప్ప జంతువౌ ఏనుగు బరువును
తూచడ మెట్లని సభికుల నడిగెన్

ఆ ! ఏనుగు బరువా ? యని
ఆలోచించా డమాత్యుడొక్కడు
దాని బరువు చెప్పడ మెట్లని
ఆకాశాన్ని చూచాడొక్కడు

చప్పున కన్నులు మూశాడొక్కడు
గప్పున బుర్రను గోకాడొక్కడు
ఎప్పుడు మేము వినలేదంటూ
చెప్పిరి రాజుకు చేరిన జనులు

అట్టి పట్టున అచ్చటి జాలరి
చట్టున లేచి చిటిక వేయుచు
వెంటనె నేను చెప్పెదననుచు
గట్టిగ రాజుకు హామీ యిచ్చెన్

తూచే పద్ధతి తెల్పిన జ్ఞానికి
స్వచ్ఛంబైనా మణుగు పసిడిని
కచ్చితంబుగ కలవరపడక
ఇచ్చెదననుచు చెప్పెను రాజు

అమితానందం పొందిన జాలరి
అయితే యిప్పుడు బయలుదేరుడు
అందరి యెదుట గుట్టును చెబుత
అంటూ చేరెను అతడొక కొలను

కొలనులో వాడు పడవను నిలిపి
ద్విరదము నొక్కటి దానిలొ నిలిపి
కరిగలపడవ మునిగిన మేరకు
గుర్తు పెట్టెను గుట్టును దెలుప

వెంటనె గజమును క్రిందికి దింపి
గట్టిగ పడవను ఇసుకతొ నింపి
పెట్టిన గుర్తు వచ్చిన వెనుక
గట్టుకు దానిని లాగండనెను

నింపిన యిసుకను అప్పుడు జాలరీ
సొంపగు రీతిలొ సరిగా తూచి
మెప్పించు రీతిలో బరువును
ఇప్పించు రాజా మణుగు పసిడి అనె

అవనీశుండాతని ప్రజ్ఞకు
అమితంబైన ఆనందమొందా
చెప్పిన పసిడిని జాలరికిచ్చి
అనేక రీతుల సత్కరించెను

పూర్వ గ్రంథముల్ త్రిప్పినవారు
ఆర్యోక్తులను అరసినవారు
సర్వం తెలిసిన సర్వజ్ఞులును
గర్వంబుడిగిరి క్షణకాలములో!

నీతి

పుస్తక పరిజ్ఞానమె చాలదురా
బెస్తని లోకజ్ఞత నరయుమురా!




మందలు మందలు మందలు
  ఆవుల మందలు అవిగో !
పచ్చని పచ్చని పచ్చికల
మేసెడి మందలు అవిగో !

మెల్లనా మెల్లన కదలీ
ఆవుల మందలు వదలీ
చల్లగ వచ్చెను ఆవిదే
మల్లెల మనసుల తల్లిదే !

ఆవును పట్టీ ఒక పులి
ఆరగించగా తలచెను
"ఆగుము ఆగుము పులిరాజా !"
ఆలకించరా ఓ రాజా !

పాలను వదలీ నా కూనా
పాలకు 'డీలా' పడుగాన
చేపి వచ్చెదను నీకడకు
చూపుము నీదయ కాదనకు

ఆవును పులి దయ దలచింది
దూడను చూడగ పంపింది
ఆవు ఇంటికీ పోయింది
పాలు ఇచ్చి ఇట్టే తిరిగొచ్చింది

ఆవును చూసిన ఆ పులి
ఆశ్చర్యంతో ఇట్లంది :
ఆడిన మాటలు దప్పవు
సత్యం అన్నది నీ సొత్తు
నిత్యం నిలుచును మనసొత్తు !




డుబుక్ .... డుబుక్ !

బుడుక్ .... బుడుక్ !!

ఏటిగట్టు మీదనున్న
మేటిరేగి చెట్టునున్న
పళ్ళు ముగ్గి ఒక్కొక్కటి
భళ్ళున పడు నీటిలోన-

డుబుక్ - డుబుక్ !
బుడుక్ - బుడుక్ !!

తినవలసిన పండ్లనిట్టు
మునుగనీట రాల్చుచెట్టు
కింతబుద్ధి లేదదేమి
యంచుకోతి కినుకజెందె-

డుబుక్ - డుబుక్ !
బుడుక్ - బుడుక్ !

చెట్టుకొమ్మ మీదనున్న
చిట్టికోతి చూచుచుండ
పండ్లురాలి పడిపోవగ
వంతగుండె 'అరెరే' యని-

డుబుక్ - డుబుక్ !
బుడుక్ - బుడుక్ !!

చెట్టుకొమ్మ నట్టెబట్టి
కొట్టివేగ నూపివేయ
కొమ్మనున్న పండ్లు రాలి
కొమ్మ బోసిపోయెనంత

డుబుక్ - డుబుక్ !
బుడుక్ - బుడుక్ !!

ఉన్న పండ్లు ఊడిపోయి
కన్నులెదుట నీట మునుగ
కన్ను దెరచి కలవరపడె
ఉన్నవియును పోయెనంచు

డుబుక్ - డుబుక్ !
బుడుక్ - బుడుక్ !!

కాయ పండి రాని పోవు
కాలమిచ్చు తీర్పు అదియె
ప్రకృతి గుణమును గానక
వికృతిగా దలచరాదు-

డుబుక్ - డుబుక్ !
బుడుక్ - బుడుక్ !!

ఒడలెరుగని కోపంబున
చెడు పని చేసిన కోతి
తన కోపమె శత్రువాయె
నని ఏడువ కంటినీరు
ఏటబడియె- బొట్టుబొట్టు-

డుబుక్ - డుబుక్ !
బుడుక్ - బుడుక్ !!




(తెల్లవారు ఝామున తూరుపున చుక్క పొడుస్తుంది. కోడి కూస్తుంది. ఊరూ, ఇల్లూ లేస్తుంది. గేయం భూపాలరాగంలో నడుస్తుంది. నేపథ్యంలో పాడుతూవుంటే, బాలలు రంగస్థలంమీద అభినయిస్తారు.)

*కోడి :*

కొక్కొ-రొకో - కో!

*బృంద గానం :*

కొక్కొ-రొకో అంటు కోడి కూసింది.

టక్కు-నా మా అవ్వ నిద్రలేచింది....
నిద్రలేచింది.... నిద్రలేచింది.

అవ్వలేచీ అమ్మనూ లేపే-
అమ్మనూ లేపే- అమ్మనూ లేపే-

*పాప :*

అమ్మరో నన్నెవరు లేపేరు నిదుర-
లేపేరు నిదుర- లేపేరు నిదుర-

అమ్మ :

నేను లేపేనమ్మ నేను లేపేనూ-
నేను లేపేనూ- నేను లేపేనూ-

పాప :

అమ్మరో నిన్నెవరు లేపేరు నిదురా !-
'లేపేరు నిదురా- లేపేరు నిదురా-

అమ్మ :

అవ్వ లేపిందమ్మ- అవ్వ లేపింది-
అవ్వ లేపింది- అవ్వ లేపింది-

పాప :

అవ్వరో నిన్నెవరు లేపేరు నిదురా-
లేపేరు నిదురా- లేపేరు నిదురా-

అవ్వ :

అల్లదుగో ఆ కోడి కూతవేసింది-
కూతవేసింది- కూతవేసింది-

పాప :

నిన్నెవరు లేపేరె అమ్మ కోడమ్మా !
అమ్మ కోడమ్మా ! అమ్మ కోడమ్మా !

కోడి :

తూరుపున చక్కని చుక్క లేపింది
అల్లదుగో అల్లదే ఆ వేఁగుజుక్క.

కొక్కొరోకో !—



# ఉడుతపాట

దేవులపల్లి వేంకటకృష్ణశాస్త్రి

సీత

హూత్ ఉడతా! హూత్ ఉడతా!
ఊరికి వెడతావా?

ఉడత

ఛాత్ సీతా! ఛాత్ సీతా!
తప్పక వెడతాను!

సీత

బండీలేదు, బస్సూ లేదు
ప్రయాణమెట్లాగ?

ఉడత

కొమ్మలు తెచ్చి, ఆకులు తెచ్చి
గూడు కడతాను
చిన్నా, పెద్దా రెమ్మలు తెచ్చి
చక్రాల్ కడతాను
తొండాగుర్రం బండికి కట్టి
తోలుకువస్తాను
బండీమీదా కొరడా పట్టుక
బైఠాయిస్తాను!

కాశీ వెడతా, బొంబాయ్ వెడతా
కలకత్తా చూస్తా!
కావలిసొస్తే ఢిల్లీకూడా
కదిపేసే వస్తా!
అందరు మనుషులు ఒకటేనంటూ
స్నేహం చేస్తాను
చెన్నాపట్నం సాయంత్రానికి
చెంగున వస్తాను.




అబ్బి

చిట్టీ! పొట్టీ! సిగరెట్టు పెట్టీ
శ్రావణ పట్టీ! నాన్‌రొట్టీ!

చిట్టి

అబ్బీ! గొబ్బీ! పౌడరు డబ్బీ!
ఇత్తడి సిబ్బీ! మా అబ్బీ!

అబ్బి

మా చిట్టి మొగుడికి బానంత పొట్ట!
పొట్టనిండా రెండు బుట్టలుండ్రాళ్లు!!

చిట్టి

అబ్బిగాడి పెళ్లానికి కొండంత గూను!
గూనెక్కి మా అబ్బి కోటకెడతాడు!!

అబ్బి

అమ్మా! చిట్టిని తన్నేస్తా!

చిట్టి

చూడమ్మా- ఈ అన్నయ్యా!

అమ్మ

అల్లరి చేస్తే అబ్బికి, చిట్టికి
అప్పచ్చులు సున్నా!

[ అబ్బీ, చిట్టీ గప్‌చిప్ ]




ఆవుగారి తువ్వాయీ! ఆవుగారి తువ్వాయీ!
అమ్మ బువ్వ పెడుతుంది వస్తావటే
లక్కపిడతలున్నాయి పప్పు బెల్లాలున్నాయి
బొమ్మరిల్లు కడదాము వస్తావటే?

చిట్టిగారమ్మాయీ! చిట్టిగారమ్మాయీ!
పొట్టనిండ పాలు తాగి వస్తానుండు
అమ్మ వళ్ళు తుడిచాక వస్తానుండు
అమ్మతోను చెప్పాక వస్తానుండు

ఆవుగారి తువ్వాయీ! ఆవుగారి తువ్వాయీ!
కనులు కాటుక పెడతాను వస్తావటే
పసుపురాసి కుంకమ పెడత వస్తావటే
ఆడుకోను పోదాము వస్తావటే

చిట్టిగారమ్మాయీ! చిట్టిగారమ్మాయీ!
బొమ్మరిల్లు కడదాము వస్తానుండు
దాగుడుమూత లాడుదాము వస్తానుండు
అమ్మ చుట్టు ఆడుదాము వస్తానుండు




అన్న : ఇదిగో, ఇదిగిదిగో -
ఓ మామిడి పింది
ఇపుడే రాలింది, కడు
ఇంపైన పింది

చెల్లి : నిగనిగ లాడుతోంది
'నన్ను చూడు !' అంటోంది!

అన్న : ఈ కన్నుల పడింది
ఇంకెటు పోతుంది ?

చెల్లి : నవనవలాడుతోంది
'నన్ను కొరుకు' అంటోంది !

అన్న : అబ్బా ! నిన్ను తినమంది-
ఆఁ, నాకు దొరికింది

చెల్లి : 'నన్ను కొరుకు' అంటోంది
నోరూరుతోంది !

అన్న : కంగారెందుకులే
కాకెంగిలి చేస్తా !

చెల్లి : నవనవలాడుతోంది
నా నోరూరుతోంది !

అన్న : తిందాంలే చెరిసగం
తిన్నగా పెట్టు మొగం

చెల్లి : నీకో చెక్కా, నాకో చెక్కా
తిందాం ఎంచక్కా !

అన్న : కంటికైంది విందు ! ఆహా !
పంటి కా పసందు !

చెల్లి : ఉప్పు, కారం అద్దుకుని
ఊరిస్తూ తిందామా ?

అన్న : వగరు మేసి కోకిలతో
వంతులాడదామా ?

చెల్లి : కో !

అన్న : కో !

చెల్లి : కో యంటే

అన్న : కో యంటూ

చెల్లి : కోకిల నాడిద్దామా ?

అన్న : కూతలు వేయిద్దామా ?




రాము :

రంగురంగుల గాలిపటం
రయ్యిన ఎగిరే గాలిపటం
'అయ్యయ్యో' నా గాలిపటం
అక్కయ్యో చిక్కెను చెట్టుకొమ్మకే
రమ్మని నేనూ లాగుతు ఉంటే
కొమ్మల నక్కి రానంటూంది

అక్క :

అల్లరివాడవు నీ జతవద్దని
అలిగీ కొమ్మల దాగినదేమో ?

రాము :

బిళ్ళలు, మిఠాయి లిస్తానంటే
వస్తుందా, దిగి వస్తుందా ?

అక్క :

బిళ్ళలు, మిఠాయిలిస్తేరాదు
అల్లరి పిల్లల జతమానాలి !

రా ము :

చక్కెర, పాలూ ఇస్తానంటే
వస్తుందా దిగివస్తుందా ?

అ క్క :

చక్కెర, పాలూ ఇస్తే చాలదు,
చక్కగ బడికి వెళ్ళాలి !

రా ము :

అల్లరి మూకతో ఆడను, ఆడను
చదువులు మాని ఆటలాడను !

అ క్క :

అయితే అదిగో గాలిపటం
అల్లనమెల్లన దిగివస్తోంది
గాలిపాటుతో కొమ్మను వదలి
'గబగబ' క్రిందికి వస్తోంది !

స్వాగతమమ్మా ! స్వాగతం !
రంగురంగులా గాలిపటం !
స్వాగతమమ్మా స్వాగతం !




చెట్టుమీదా వాలె
చిన్నారి చిలుక
చిలుకమ్మ వళ్ళంత
చిగురాకుపచ్చ
చిలుకమ్మ ముక్కేమొ
చిదిమినా దొండ!

ఎఱ్ఱముక్కున ఉంది
దోర జామీపండు
పండు కోసము పాప
చెట్టు కిందే కాపు
హుష్షంది - హుష్షంది
చప్పట్లు చరిచింది

గులక రాయేరింది
గురి చూచి విసిరింది
పండు కోసము పాప
పాట్లెన్నొ పడినాది
పాపాయి తెలివికి
పగలబడి నవ్వింది
నోట కరచుక పండు
చిలుకెగిరి పోయింది.




"వినరా కథా కనరా కథా
కనుల ముందర ఉంది కనరా కథా"

తోడేలు : ఆరు నెలలకు ముందు కోరి నను తిట్టావు - ఏ
నేరమున్నదని నను కోరి తిట్టావు ?
చంపుతా నిన్నిపుడు ఓ మేకా ! - నిన్ను
పంపుతా 'యమపురికి' ఓ మేకా !

మేక : ఆరు నెలలకు ముందు అసలు పుట్టనెలేదు
ఎట్టులిక నే నిన్ను తిట్టగలనంటావు ?
నేనెరుగ నేనెరుగ తోడేలా !
నిన్నెట్లు తిట్టాను తోడేలా !

తోడేలు : నీవు తిట్టని యెడల నీతల్లి తిట్టింది
ఎవరైన నాకేమి వివరాలు నాకేల ?
పంపుతా నిన్నిపుడు ఓమేకా !- డొక్క
చింపుతా నిన్నిపుడు ఓ మేకా !"

బాలుడు : కడకు తోడేలటుల కజ్జాను పెంచింది
చిన్న మేకను చంపి విందారగించింది
చేటు తెచ్చేవారి నో చెల్లాయీ !
చేరబోకమ్మ ఓ బుజ్జాయీ !




రైతు

ఎరుకయ్యా! ఎరుకయ్యా!
ఒక్కమాట వినవయ్యా!
ఎలుకదండు వెడలెనయా!
పంటసిరిని కొరికెనయా!
ఎలుక బాధ తీర్పవయా!
ఎంతైనా ఇత్తునయా!

ఎరుక

సరే సరే బాబయ్యా
పని రాత్రికె మొదలయ్యా
ఎలుకకొక్క పావలా
దయసేయుడు నాకయ్యా!

రైతు

సరే సరే లేవయా
నీ కష్టము తెలుసయా

ఎరుకవాడు కదలెనూ
పొలములోకి వెళ్ళెను
ఎలుకలన్నీ పట్టెను
బుట్టలెన్నో పెట్టెను
రాత్రివేళ నా రైతు
చేనిలోనికి వెళ్ళెను
బుట్టలందు చిక్కినా
ఎలుకలెన్నో చూచెను;

ఎలుకకొక్క పావలా
ఎన్ని రూకలాయెరో!
అనుచు బాధ పడెనురా
మనసు మార్చుకొనెనురా

"ఎలుకలన్ని తీసెద
ఏటిలోన వేసెద
ఎలుకబాధ తీరును
ఎరుక పీడ వదలును
డబ్బులన్ని మిగులును"
అని మది తలపోసెను!

బుట్టలోని ఎలుకలన్ని
పీకివేయుచుండగా
బుట్టలోన చిక్కినా
పాము ఇట్టె కరచెను
దురాశకు చిక్కి రైతు
ప్రాణమపుడె వీడెను

# పళ్ళబేరం



నార్ల చిరంజీవి

బిడ్డ: పళ్ళోయమ్మా పళ్ళు
పాల తీయనీ పళ్ళు
పళ్ళోయమ్మా పళ్ళు

తల్లి: పళ్ళు పళ్ళు అంటు
పరుగెత్తుతున్నావు
ఏ ఊరుదానివే పళ్ళమ్మీ!
ఏ ఊరు దానివే చిన్నమ్మీ॥

బిడ్డ: చాలా దూరంగా పోయి
సంజేళ రావాలి
ఊరి పేరెందుకే కన్నమ్మా? నా
ఊరి పేరెందుకే!

తల్లి: పోవచ్చులే పిల్ల
బుట్ట దించవె ముందు
బేరాలు కుదిరితే కొంటాను- నే
బేరాలు కుదిరితే కొంటాను

తల్లి: ఎక్కడికి పోతావు
ఎవ్వరికి ఇస్తావు
ఉత్తుత్తి పళ్ళెవరికోసమే? ఈ
ఉత్తుత్త పళ్ళెవరికీ?

బిడ్డ: ఉత్తుత్త పళ్ళకే
ఊరింది నీ నోరు
పాపాయికోసమే ఈపళ్ళు మా
పాపాయి కోసమే

తల్లి: ముద్దెట్టుకొంటాను
ఒక్క పండీయవా చిన్ని?

బిడ్డ: ఆ బేరమైతే సరి
అన్ని పళ్ళూ నీకే- అమ్మా!

తల్లి — బిడ్డ:
పళ్ళోయమ్మా- పళ్ళు
పాల తీయని పళ్ళు




బాలుడు

చిట్టి చీమా? చిట్టి చీమా?
పొట్టి చీమా? పొట్టి చీమా?
చిన్నవాడను నేను వస్తిని
ఏమి నేర్పెదవే?- నా
కేమి నేర్పెదవే?

చీమ

జట్టుగా ఉండాలి అందరు
కట్టుగా ఉండాలి ఎప్పుడు
ఒళ్ళువంచీ పనులు చేసే
ఓర్పు నేర్తువటోయ్!

వెలుగు ఉన్నపుడేను, నీకూ
బలము ఉన్నపుడేను, నీవూ
విద్యనేర్చి, వృత్తిచేసి
ధనము ఆర్జించు!

కొంతకొంతగా కూర్చుకొంటే
ఇంతలో ఆవంత అంతా
వంతువంతుగ వృద్ధిపొందీ
కొండలవుతుంది

వయసులో శ్రమచేయువారు
వయసు మళ్ళిన ఏడ్వబోరు
మంచి పనులకు మంచి బహుమతి
పొందమంటావా! నీ
వందుకుంటావా?




అమ్మ :

పక్షులు లేచే
పల్లెలు లేచే
అలిగిన పాపా
పక్కా దిగవే!

పాప :

రంగుల గౌను
తెచ్చేవరకూ
అమ్మా! నేనూ
పక్కా దిగనే!

పాప :

కాళ్ళకు గజ్జెలు
తెచ్చేవరకు
అమ్మా! నేనూ
పక్కా దిగనే!

అమ్మ :

కమ్మని గారెలు
వండితి నేడూ
పాపా! నువ్వా
పక్కా దిగవే!

అమ్మ :

అక్కా, అన్నా
స్నానం చేసిరి
పాపా! నువ్వా
పక్కా దిగవే!

పాప :

కోరిన వంటలు
చేసేవరకూ
అమ్మా! నేనూ
పక్కా దిగనే!

అ మ్మ :

బడికి వెళ్ళి
శ్రద్ధగ చదువగ
ముద్దుల పాపా !
పక్కా దిగవే !

పా ప :

కమ్మని కథలూ
బొమ్మల పొత్తం
ఇచ్చేవరకూ
పక్కా దిగనే !

అ మ్మ :

నువ్వా కోరిన
కోర్కెలు తీర్చ
అత్తా, మావా
అదుగో ! వచ్చిరి

కథకుడు :

(అప్పుడు పాప)
అలుకమానీ
దిగ్గునలేచి
చరచర నడిచే
వాకిలివైపు-

పా ప :

అత్తా-మామా
ఏరమ్మా ?

అ మ్మ :

హైదరాబాదులో
ఉన్నారమ్మా !




*బుడత :*

ఉడుతా ఉడుతా !
మంచి మాటొకటి చెబుతా
చెట్టుదిగిరా- నీకు
మేడొకటి కడతా ! !

*ఉడుత :*

చెట్ల తిరిగే మాకు
మేడ లెందుకు బుడతా !
ఎత్తు కొమ్మల్లోనే
సుఖముంది వెడతా ! !

*ఉడుత :*

ఉడుతలకు- బుడతలు
మేడ కడతారా ?
మాయమాటలు చెప్పి
పట్టుకెళతారా ?

*బుడత :*

అంతంత ఎత్తుగా
ఎంతెంత కొమ్మలు
గంతులేస్తే కాళ్ళు
విరగవా ఉడుతా ?

*బుడత :*

మాయమాటలు కాదు
మా మేడ నీకిస్తా-
తియ్యతియ్యని పండ్లు
గదులనిండా పోస్తా-

*ఉడుత :*

చెట్లపై మా బ్రతుకు
కట్టబడి ఉంది-
దూకడము ప్రాకడము
పుట్టుకతో వచ్చినవి-

*బుడత :*

మేడలో మెత్తని
పరుపులుంటాయి
గదులలో పంకాలు
తిరుగుతుంటాయి

ఉడుత :

మేడలున్నవి మీకు
గూడులున్నవి మాకు.
కమ్మకమ్మని పండ్లు
కడుపునిండా మెక్కి
చల్లచల్లని నీళ్ళు
చిటికెడన్ని తాగి-
గుబురు కొమ్మల్లోన
గుట్టుగా ఉంటాము-
నిదురవస్తే గూళ్ళ
బజ్జుకుంటాము....

బుడత :

ఎన్ని చెప్పిన నన్ను
నమ్మలేకున్నావు-
ఎన్నిమార్లడిగినా
రాను రానంటావు

ఉడుత :

అట్లనకు- అట్లనకు
బ్రతుకుబాటలు వేరు-
పిల్లలెందరో మాకు
హాని కలిగిస్తారు-
చెట్లపైనే మాకు
సుఖముంది బుడుతా!
దిగిరాను- దిగిరాను
చెట్టు దిగితే- చెడత;



# నేను-నిద్రా

మిరియాల రామకృష్ణ

నేను : చదువంటె నిద్రా! ఈ
చనువేమిటి చెప్పూ!
కథలు చదువుకుంటుంటే
కాస్త నువ్వూ వినరాదూ?

నిద్ర : మంచి కలలు తెచ్చినాను
మరచిపోయి నావేమో
మల్లెపూల ఉయ్యాలలు
మా ఇంట్లో ఉన్నాయటా

కథలు : తియ్యని మా కథలకన్నా
తినవలసిన దేముండును?
కథలకు నీ కన్నులిచ్చి
కలసిపోకు నిద్రలోన

నేను : కలలూ కథలూ కూడా
కావలసినవే కానీ-
నిద్రా! నిన్ను నమ్మరాదు
నెమ్మదిగా వెళ్ళిరా!



# తీపి-చేదు

నిరంఘాటం శ్రీరామకృష్ణశాస్త్రి

అందాల తోట అది
బృందావనిలా ఉన్నది
ఎన్నో పక్షుల పెన్నిధి
కలకల కిలకిల మన్నది

చెట్టు తొఱ్ఱలో చిలుకకు
చెట్టుపైని కాకమ్మకు
కలిసింది చిత్తము
కలిగింది నేస్తము

రామచిలుక ఒకనాడు
మామిడి, దానిమ్మ, జామ
పండ్లు తెచ్చి విందునకు
పిలిచింది కాకమ్మను ?

పండ్లు చూచి నవ్వి కాకి
పలికింది చిలుకతో;
మా ఇంటికి రావమ్మా
మంచి విందు చేతునని

వేప, మఱ్ఱి, రావి, జువ్వి
కాయలేరి తెచ్చింది
పుల్లల గూటికి చిలుక
మెల్లగ మరి వచ్చింది

ముక్కు తోన కొరికింది
మూతి విరిచి మరలింది
తీపి తినే నోటికి
చేదు రుచిగ నుండునా ?




చక్కని గూడల్లుకొన్న
దొక్క సాలెపురుగు
అటూ ఇటూ కదలి కదలి
మురిసెను సాలీడు ! !

అంతలోనె చెంతనెగిరె
నొక్క ఈగబావ
ఇలా వచ్చిచూడు
ఎంత మెరుపు చీరలల్లి
తెరలు కట్టినానొ !

వింత వింతలెన్నొ ఇటు
చూడుము మా ఇంట
చూచి మురిసిపోదువులే
మనసు పొంగిపోవ !

సాలెపురుగు దుష్టబుద్ధి
తెలిసికొన్నది ఈగ
దూరముగా జరిగిపోయి
ఇలాగంది ఈగ;

"సాలీడా ! సాలీడా !
అందమైన తెరలు
చూచినాను మురిసినాను
తెలిసె నీదు మనసు

"లోనికెవరు వత్తురొ వా
రింక తిరిగిపోరు
నీ తెరలో నీవె ఉండు
హాయిగ నాకేల ?"

ఈగ బావ ఎగిరిపోయె
ఎంచక్కా పైకి
తిండికొరకు తిరిగి తిరిగి
అలిసె సాలెపురుగు !




యాపిల్ చెట్టూ నీడన
బాబయ్యొక్కడు ఉన్నాడు
ఏవో ఏవో ఊహలతో
ఏదో లోకానున్నాడు !

రివ్వున గాలీ వీవంగ
పండిన పండూ రాలంగా
ఈ లోకంలో కొచ్చాడు
ఇలాగా అనుకున్నాడు;

"పండిన పండూ పైకీ పోక
నేలకు ఎందుకు రాలాలి ?"
అంటూ యోచన చేశాడు
ఫలితం ఇలాగ తేల్చాడు :

"భూమికి ఉందొక ఘనశక్తి
ఆకర్షణయే ఆ శక్తి !"
అలాగ చెప్పిన బాబయ్యే
'న్యూటన్' అని మరి తెలియండి !



# చీమ కీచురాయి

కె. సుధానిధి

కొమ్మలోన కీచురాయి
చీకు లేక, చింతలేక
కీచుమనే పాటలతో
గ్రీష్మ ఋతువు గడిపివేసె

వానలతో, వరదలతో
వచ్చిపడెను వర్షఋతువు
తిండిలేక కీచురాయి
చీమ చెంత కరిగెను

"చీమా! ఆకలిగొంటిని!
ఇమ్ము నాల్గు గింజలు!– నీ
ఇంట నిలువ నీడనిమ్ము!"
అని చీమను బ్రతిమాలెను

ఒళ్ళు వంచి కూడబెట్టు
కొన్న తిండి నీకు పెట్టి
పస్తులుండలేను నేను;
పోపో, సోమరిపోతా!"

అని పొదుపరి చీమ భళ్ళు
మని తలుపులు మూసెను;
ముందుచూపు తనకులేక
కీచురాయి వగచెను!




అనగనగా ఒక ఊళ్ళో
ఉన్నాడొక పిల్లవాడు
ముద్దుచేసి తలిదండ్రులు
మురిపెముగా పెంచినారు

చదువంటే శ్రద్ధలేదు
గురువంటే లెక్కలేదు
ఎందుకు చదువని బడికే
ఎగనామం పెట్టినాడు

పిల్లవాని తీరుచూచి
తల్లి మనసు తల్లడిల్లె
చదువు విలువ తెలియజెప్ప
ఉపాయాన్ని యోచించెను

కోతుల నాడించువాడు
ఒక రోజున వచ్చినాడు
మనిషి చేయగల పనులు
కోతిచేత చేయించెను

అంతట తల్లికి చక్కని
ఆలోచన తట్టింది
లోనికెళ్ళి పుస్తకాన్ని
తెచ్చి కోతికిచ్చింది

కోతి దాన్ని ఎగాదిగా
చూసి చించివేసింది
కిచకిచమంటూ ఎగురుతు
కేరింతలు కొట్టింది

"ఇన్ని పనులు చేయు కోతి
చదువెందుకు చదువలేదు?"
కొడుకు ప్రశ్న విన్న తల్లి
కొడుకుకు ఇట్లు జవాబిచ్చె:

చదువు ఉంటె అదికూడా
మనుషులంత గొప్పదే
మనిషికి పశువుకు తేడా
చదువంటారందుకే!

తల్లి మాట విన్న కొడుకు
తలవంచుకు నిలిచినాడు
చదువులోని గొప్పతనము
చక్కగ గ్రహించాడు




తర్కం చదివిన పండితుడు
దస్తాగిన్నొక ఎత్తుకొని
నూనె కోసమని ఒకనాడు
గానుగ వద్దకు వెళ్ళాడు

కళ్ళకు గంతలు ఉన్నట్టి
గానుగ ఎద్దును చూశాడు
గంతలు కట్టావెందుకని ?
గానుగ వారిని అడిగాడు

ఎరుగర స్వామీ ఈ మాత్రం
గిరగిర గిరగిర తిరుగుటచే
కండ్లు తిరిగి అది పడునంచు
కండ్లకు గంతలు కట్టాను

చక్కని పని చేశావయ్యా
చతురుడవయ్యా నీవయితే
ఇంతకు మెడలో గంటొకటి
ఎందులకయ్యా కట్టావు ?

ఎద్దును తోలీ నేనెట్లా
ఇంట్లో పనులను చేయుదును
ఎద్దు తిరుగుతూ ఉంటేను
ఎప్పుడు మ్రోగును ఆ గంట

గంట చప్పుడూ కాకుంటే
వెంటనె బయటకు నేవచ్చి
ఎద్దును మెల్లగ అదలించి
ఇంట్లో పనులను చూచెదను

సరిసరి తెలిసిన వాడల్లే
సమాధానమును చెప్పావు
మెదలక నిలచీ నీ ఎద్దూ
మెడ ఆడిస్తే ఏంచేస్తావ్ ?

అంతటి తర్కం మాయెద్దు
నేర్వలేదు మరి బాబయ్యా !



# సింహం-గాడిద

ఉత్పల సత్యనారాయణాచార్య

సింహముతో నొకగాడిద
  స్నేహంబును గోరివచ్చె
అందులకా సింహమెంతొ
ఆదరమున ఒప్పుకొనెను

ఆహారము సేకరింప
అపుడా జంతువులు రెండు
ఒకరికొకరు సాయపడగ
ఒప్పందము చేసికొనెను

కావలసిన జంతువులను
గాడిదకొని రావలయును
సింహమప్పు డవ్వానిని
సంహరించి పంచవలయు

ఈ తీరుగ ఆ రెండును
ఇష్టమైన జంతువులను
పట్టి చంపి మాంసమంత
పదిలపరచె ఒక్కచోట

అంతకొంత సేపటిలో
ఆ సింహము మాంసమంత
మూడు భాగములుగ చేసి
గాడిదతో ఇట్టులనెను

"మృగరాజును నేనగుటను
మేర తప్పకుండ నాకు
కానుకగా మొదటి పాలు
గౌరవించి ఒసగవలయు

నేను కూడ నీ తోడుగ
నిలచియుండి వేటాడితి
కావున ఈ రెండవదియు
రావలయును నాకు సరిగ

మంచి చెడుగు లాకళించి
మారుమాట లాడకుండ
ఈ మూడవ పాలుకూడ
ఇచ్చివేయ వలయు నాకు

నిజము చెప్పుచుంటి నిపుడు
నీవింతట ఒప్పుకొనుము
లేకుండిన బ్రతుక వీవు
లేచిపొమ్ము ఎటకైనను"

అని సింహము బొబ్బరించి
ఆ గాడిద నంపివేసె;
దుష్టుడైన బలవంతుని
తోడి చెలిమి కూడదు కద!




అనగా అనగా ఒక నవాబుగారు
కథలంటే ఆయనకెంతో హుషారు
ఎందరెందరో ఆయనవద్దకు వచ్చేవారు

ఇలా ఉండగా ఒకనాడు
వచ్చాడటకొక బోయవాడు

ఆతని కట్టూబొట్టూ చూచి
అందరు తమలో నవ్వుకున్నారు

కథలు మొదలుపెట్టె బోయవాడు !

"అనగా అనగా ఒకరేడు
కొత్త తుపాకితో ఒకనాడు
అడవికి వేటకు వెళ్ళాడు

అడవిలో ఉన్నది ఒక చెట్టు
ఆ చెట్టును చూచీ చూడగనే
రాజుగారి తుపాకి పేలెను ఢామ్మని
తుర్రుమన్నది ఒక చిలుక
రాజుగారు సంతోషంతో కులుక"

నవాబుగారు ఊకొట్టగ
అతడట్లా కథ చెపుతుండెను
'తుపాకి ఢాం చిలుక తుర్
తుపాకి ఢాం చిలుక తుర్'
ఫిర్ అన్నాడు నవాబు కోపంగా

మళ్ళీ తుపాకి పేలింది
మళ్ళీ చిలుక తుర్రంది
ఫిర్ ! చిలుక- తుర్
ఫిర్ ! చిలుక- తుర్...."

నవాబుగారి ముఖం ఎరుపెక్కె
వినండి ప్రభు అనె బోయడు
"కథ చెప్పావా, నీ ప్రాణం తుర్
ఏమనుకున్నావ్ కపడ్‌దార్"

అలా మండిపడగా భూపతి
అయితే ఇప్పించండి బహుమతి
అని బోయవాడు అర్థించాడు
నవాబు నవ్వుతు అన్నాడు

"అలాగే, అలాగే !"

జరూర్ ! జరూర్ !




ఆరుబయలు చెట్టుకింద
పైరగాలి వీచుచుండ
కుక్కిలోన పసిబిడ్డడు
చక్కగ నిదురించుచుండె

కన్నె వయసు జ్ఞాపకాలు
కన్నుల ముందాడుచుండ
కన్నతల్లి సమీపాన
అన్నముడుక వేయుచుండె

అప్పుడొక్క పండుకోతి
రెప్పపాటులోన వచ్చి
పొత్తిళ్లను చంటిబిడ్డ
నెత్తుక చెట్టెక్కిపోయె

అలికిడి విని బిడ్డతల్లి
ఉలికిపడి శిరస్సునెత్తె
ఆ దృశ్యము చూచినంత
నామె గుండె అవిసిపోయె

మబ్బుల వరకేదిగినట్టి
మర్రిచెట్టు పంగలలో,
కుదురులేని కోతికేల
బెదురులేని చంటిపాప

కోతిని బెదిరిస్తినేని
కొంప మునిగిపోవు ననుచు
ఆలస్యము చేస్తినేని
అపాయమ్ము తప్పదనుచు

తల్లి మనసు తల్లడిల్లె
ఒళ్లంతయు ఝల్లుమనియె
అంతలో నుపాయమొకటి
అంతరంగమందు మెరసె

దుత్తలోని అరటిపళ్ల
అత్తమొకటి వెలికితీసి
చెట్టుకింద నేలమీద
పెట్టి తలుపు వెనుక నక్కె

పళ్లవంక, పాపవంక
పండుకోతి పరికించెను
రొమ్ము కదుముకొని బిడ్డను
నెమ్మదిగా దిగివచ్చెను

పక్కమీద పసిగుడ్డును
చక్కగా పరుండబెట్టి
ఉరికె నిట్టె చెట్టుమీది
కరటిపళ్లు చేతబట్టి

సుంత చెక్కుచెదరకున్న
నిదురలోన నవ్వుచున్న
చిట్టి తండ్రి నెదహత్తుక
నిట్టూరుపు విడిచె తల్లి!



# వరాలు

కె. సభా

ఒడిలోన ఉన్నట్టి
పాపలందరి లోన
బంగారు లాంటిది
పాప వరాలు

తులువ పనులకు నేను
దూరమంటుంది
పలికితే వినయాలు
చిలుకరిస్తుంది

ఒంటిగా ఒకనాడు
ఒక చెట్టు క్రింద
కంట నీరెత్తుకొని
కనిపించె నాకు

ఎందుకే ఓ పాప
ఏడ్చుచున్నావు
ఏమి కావాలమ్మ
ఎరిగించమంటే

బడికై జీతము గట్ట
నడుగగా నాన్న
డబ్బులిచ్చెను గాని
డబ్బు కట్టకనే

ఖర్చు పెట్టితినంచు
కన్నీరు విడిచె
ఏమిటే ఆ ఖర్చు
ఎందుకయ్యింది ?

తప్పు చేసితివేమొ
చెప్పమన్నాను
అల్లదుగో గుడిసెలో
ఆ తాత చూడు

ఆకలంటే ఇచ్చి
నానంటు పలికె;
గుడిసెలో చూడగా
గూని తాతయ్య

నవ్వుతూ నవ్వుతూ
బువ్వ తినుచుండె !

నా వరాలు అంటు
నా ప్రక్కనున్న
చిట్టిపాపను చూచి
చిరునవ్వు నవ్వె

పాప డబ్బులు తెచ్చి
పాప కిమ్మంటూ
కోపాన తాతను
కొట్టబోయాను

తాతయ్య వదరుతూ
తన మురుగును తీసి
అమ్మకొండని చెప్పి
అరచేత నుంచె

బంగారు మురుగుతో
పయన మౌతుంటే
పాపాయి అడ్డమై
పట్టుబట్టింది

మురుగు మళ్ళీ తాత
ముందు పెట్టింది
బడి నాకు వద్దంటు
పరుగు దీసింది

పాపాయి కథ
పాప నాన్న విన్నాడు
బడి జీతమును ఇచ్చి
పాప నంపాడు.



# చలిగాడి యాత్ర

న్యాయపతి రాఘవరావు (అన్నయ్య)

అనగా అనగా ఉన్నాడొకడు
అతని పేరే 'చలిగాడు'
పుట్టిందయ్యా వానికి బుద్ధి
బుద్ధికాదది దుర్బుద్ధి !

"ఎవరి మీదనైనా వాలి
వానిని 'గజగజ' వణికించాలి
'చలిచలిచలి' అని వాడొణకాలి
'పకపకపక' నే నవ్వాలి-
అనుకుంటూ బయలుదేరాడు
వెతుక్కుంటూ "చలిగాడు"

పొలములోగల డొకరైతు
వాడే అందరికి బైతు
వాడినే పట్టాలి-
చలితో వణగ్గొట్టాలి-
అని రయితు మీది కురికాడు
ఒళ్ళంతా తెగకొరికాడు-

కాని-ఆ రైతు ఎంతంతైనా
ఒణకడు కాసింతైనా !
"ఛీ, ఛీ" వీడిక వద్దు
వీడొక ఉత్తమొద్దు

ఇంజన్ డ్రైవర్ అదుగో
వానిపై నురికెద నిదుగో !
డ్రైవర్‌పై కురికాడు
ఒళ్ళంతా తెగకొరికాడు
కాని, ఏమి ప్రయోజనం
అణిగింది వాడి గోరోజనం

ఇంజన్ అంతా అసలే వేడి
చలిగాడే అచట ఓడి
పోయాడు తన ఒళ్ళుమాడి
'అయ్యో ! అయ్యో ! అడడా ! అల్లా!'
అంటూ ఆ చలిగాడు
ఇటూ అటూ తిరిగాడు

అదుగో ! అదుగో ! జవాన్
వాడే నవ జవాన్ !

మంచుకొండపై
కంచుకోటవలె
గస్తీ తిరుగుతు ఉన్నాడు
వానిని పడతానిపుడే
వణికించేస్తా నిపుడే !
Hands up ! Hands up !
హాండ్స్ అప్, హాండ్స్ అప్
గప్‌చుప్ ! గప్‌చుప్ !

కన్నాడొక అబ్బాయిని
"వానిని పడతానిపుడే !
వణికించేస్తా నిపుడే !
చలిగాడంటే మజాకా ?
చూపిస్తా నా తడాఖా !"
అని వానిపై కురికాడు
ఒళ్ళంతా తెగకొరికాడు.

కాని
'కసరత్' చేసేవాడి ఒంట్లోకి
పిసరంతైనా చలి ఉంటుందా ?
కసరత్ చేసేవాడి
ఒంట్లో రక్తంవేడి
అని తెలియదు ఆ బోడి
చలిగాడికే రూఢి !

"అదుగో ! అదుగో ! రాకుమారి
అతి సుకుమారి !
పడితే ఆమెనే పట్టాలి !
చలితో వణగొట్టాలి" ;
అంటూ చలిగాడెళ్ళాడు
అంతఃపురానికీ వెళ్ళాడు !
రాకుమారినే పట్టాడు !
'రంయ్'మని చలి వడగొట్టాడు
అప్పుడా రాకుమారి——

వవవవ వవవవ వణికింది
ఒళ్ళంతా కంపించింది
ఫ్లానల్ జాకెట్ తొడిగింది
ఫ్లాస్కులో కాఫీ త్రాగింది
చప్పున మంచం ఎక్కింది
దుప్పటి బాగా కప్పింది

అయినా-
'వవవవ వవవవ' వణికింది
చలి చలి చలి' - అని అరచింది
ఏడీ ఏడీ చలిగాడు ?
దుప్పటిలోనే దూరాడు !
దూరీ ఏ మంటున్నాడు ?
సుకుమారుల శరీరంలోనే
సుఖముందంటున్నాడు !




తెలిసి తెలియని చిన్నతనమున
బాలుడొక్కడు తప్పు చేసెను
తప్పుచేసిన వెంటనే తన
తప్పునాతడు తెలిసికొనియెను

తల్లిదండ్రులు గురులు హితులకు
తెలియకుండగ తప్పుజేయుట
పాపమనియెడు పదము సత్యము
పాఠమందున నతడు చదివెను

తాను చేసిన తప్పు వెంటనె
తండ్రి దగ్గర చెప్పవలెనని,
మనసునందున ఎంచి బాలుడు
కొన్నిరోజులు మథన పడియెను

తండ్రితోడుత చెప్పి తప్పును
తగిన దండన పడయగోరి
ఆతడిట్టుల పత్రమందున
తుదకు వ్రాసీ తండ్రికిచ్చెను :

చెప్పకుండగ మీకు తండ్రి !
తప్పునొక్కటి మీకు జేసితి
తప్పుజేసిన వెంటనే నా
తప్పు నేనును తెలుసుకొంటిని

అట్టి తప్పుకు ఉచితమైనా
యట్టిదండన నాకు వేయుడు
అనెడి పత్రము తండ్రి కొసగి
వినయమలరగ నిలిచె బాలుడు

పత్రమంతయు చదివి ఆయన
పట్టరానీ సంతసముతో
చేసినట్టీ నీదు తప్పును
చేసినట్టే ఒప్పుకొంటివి

వలదు దానికి శిక్ష ఏమియు
ఎల్లవేళల నిజము పలుకుమ
అనుచు తనయుని సత్యసంధత
కా దినమునె బీజమేసెను

చిన్ననాడే సత్యసంధత
చూపి పెద్దల మెప్పు పొందిన
బాలుడే మనజాతిపితయై
పూజలందిన ఘనుడు బాపూ !



# చిలుకలు రెండు-మనసులు వేరు

పి. కోటేశ్వర రావు

పంజరాన రామచిలుక
పట్టి పట్టి పలుకు లొలుకు
పసిడి మాటల మూటలనుకొని
తనలొ తానే పొంగి పోవు

రామచిలు కింకొకటి వచ్చె
చిట్టి అడవి నుండి వచ్చె
రాగతనముతో పాట పాడుచు
పంజరంబూ దరికి వచ్చె''

పంజరంలొ చిలుక 'అయ్యో'
నాదు మాటలు వెలితి' అనుకొనె
'స్వేచ్ఛ లేనీ బ్రతుకులోన
అందమే కరువాయె' ననునొన్''

''నేర్చుకున్నా మాటకన్న
సహజ మైనా పాట మిన్న
అన్న నిజమును తెలిసి కొన్న
చిలుక పంజరమ్మా రోసెరన్న''

# బడాయి మేక

వెటుకూరి వెంకటనరసయ్య



కంచె చెట్టు అల్లుకొన్న
కాకరాకు మేయుచు
మేకపోతు పిలచె గరిక
మేయు గొఱ్ఱె పోతును

గొఱ్ఱె పోతువచ్చి యెందు
కొరకు బిలిచినావయా ?
గొల్లకొయ్య చూస్తే గొంతు
కొరుకునేమొ ? పోదునా ?

మేకపోతు :-

ఎప్పుడైన నా ప్రతిష్ట
చెప్పుకొనగ వింటివా ?
నన్ను "ఢీకొనన్" సమర్థు
లున్న చెప్పు చూతము

గొఱ్ఱెపోతు :-

మెత్తనాకు మేసి చేదు
తిత్తి బలిసె నేమయా ?
గుండెలున్న రమ్ము నీదు
గొప్పతనమె తేల్తును

మేకపోతు :-

శిరము నొచ్చుచున్నదేమి
చేయుమందు వల్లుడా
ఇపుడె ఎద్దుతోడ పోరి
యేగుదెంచినాడను

ఇంతలోన కంచెనుండి
ఎద్దు తొంగి చూచెను
నన్నుగూర్చి చెప్పుకొనుచు
నున్నారే మడిగెను

మేకపోతు కంచెపైన
దూరి పారిపోయెను
గొఱ్ఱెపోతు నెద్దు నవ్వు
కొన్నవాక్క పెట్టున

పొలువోక ఊరికే
గప్పాలుకొట్టు నాపలు
ముగ్గుపైకి వచ్చినపుడు
మొగము చాటు చేతురు